# ఆత్మవ్యక్తి

కవికొండల వేంకటరావు




గ్రామకథలు నవసాహిత్యం

౧

# అంకితస్మృతి

నేఁ బుట్టిపెరిగి ప్రేమించునట్టి
ఇంటికి—వాకింటికి
వీధికి—వాడకు—

1892—1908

—"వీరిపాటలు, పద్యములు, స్వచ్ఛమగు దేశప్రకృతిని ప్రాణప్రదముగ స్వీకరించి, రుచిచెడకుండ, రంగు వాడకుండఁ జదువరుల కిచ్చుచున్నవి. ఇవి కేవలము గ్రామప్రకృతికిఁ బ్రతిబింబములే గాక, మానవ స్వభావముయొక్క శాశ్వతానందమునుగూడ నంతర్లీనముగా స్ఫురింపఁ
చుండును. — —"

పదములు-పాటలు

"అమ్మ!
కాలువపట్టి తాతయకుఁ బుట్టి
నాన్నయైన సేద్యముఁ జేయు మూడునాన్న చెట్టఁబట్టి
మా కెఱుక రానట్టినాళ్ళఁ బోతివట యెప్పుడో?
నీదురీతిఁ బగటు ప్రతిమ యొండె పటం బొండె
జతపడదుగ.

అక్కో చెల్లెలో యుండియున్న
సరిగా నారూప మారూప మానా కొకానొకని
నిన్ను నాపనొకసంపత్సభఁ గీర్తింపనౌనొకో!
ఏమన—
తండ్రిరూపు కొడుకు సొమ్ముఁ :
తల్లియుం గూఁతు రెండొక్కచొప్పు వెలయింత్రు
చల్లనగు చూపుల్ నాను చూచాయలఁ.

నమ్మవో మాట—అగగో!
నీకమ్మ దోఁప నాను యానోయు వారలయమ్మలట్ల
యాటఁ బాటఁ బొంసుగు పొట్టి సగపసుకళ
నెసకమెసకంగ ముసలువా రిరుగుపొరుగు.

అలభాగ్యం బిఁక మాకు లేదుకద
నీ వావేళ నీ మా ముగుర్ కలిమిన్ దన్వివహించి
జవ్వనమునన్ గాలంబునొందావు.
చెల్లెలుపు ట్టుత్తది: మేము ముప్వురమె.
ఇం దెవ్వం డొకండేని నీ యలరూపమ్మును బోలునే మొ
తెలుపన్ బ్రార్థింతు ని న్నమ్మరో ?

ఒక్కరుఁడు వ్రాయయత్నించు నూహ లెన్నొ:
ఒక్కరుఁడు చిరునగవులఁ జక్కఁబలుకు:
ఒక్కరుఁడు జ్ఞాన మార్జింప నుత్సహించు:
ఇందు నెవ్వరిపోలికై యుందు వంబ!"

"అనుఁగుం బుత్రక !
నాదురూపమును మీ యా ముప్వురఁ నిల్పితిన్ :
కన మీ వృద్ధియె నాదు వృద్ధి యులమీకాయంబ నాకాయ
మెందును మీ రందఱు సేయు సత్కృతులు నన్నుం జాటు ;
మీ రెంతయున్ మని సత్కీర్తి గణింపఁ
జూపు నలయమ్మఁ బుట్టినా రం చిలన్."

౨

పల్లెటూరను మఱుమూల బందుగులను జూచిపోవచ్చి
యేమియుఁ దోఁచకుండఁ
గూరుచుంటిని చావడిఁ గురిచిలోన
సంస్మృతీ !
నీదు చంచత్కటాక్షవీక్ష మంతఁ జింతసేయంగ నేటికి ?
చెలుఁడు గాఁడు, బాంధవుఁడు గాఁడు, దగ్గఱివాఁడు గాఁడు
తలఁపుగొనఁదగువాఁడు గాఁ డిలను నేఁడు కలఁడో లేఁడో ?
ఏ కడలఁ దాఁ గలిని ద్రావి మసలుచున్నాడో
ఆ ముష్టిమనిషి కట్ట !

కడచిన పుష్కరంబునకుఁ గన్నులు రెండును బోయి
బాట, సంగడులదరిన్, బయిళ్లఁ
దను గ్రామ్యజనంబుల కింపుగొల్పు
రాముఁడువద మెట్టె బావ యని ముచ్చటఁ బల్లవిపెట్టి పాడె
నెన్నఁడో —
యిపు డున్నయట్లు మసనం బారిసంతువు లేనిపోనిదే.

అలవాటున విడదీసి వాని దలపోయఁగ రాదు ;
ఎందేని రా దలవానిన్ బెడఁబాసి పాటఁదలపోయన్
ముందు విన్నట్టి యూ కొలఁదిన్ రాముఁడుబావ రంగమని
సంకోచించి గొంతెత్తి వీథులలోఁ బాడిన వానిపాట
త్రుటి విందున్ గందు సంతంతనే.

# 3

ఒక్క మానిసి కోయవాఁ డక్కటకట !
మట్టమధ్యాహ్న మెండలో మంటెఁ బొరలు—
చేట జల్లెడ చీపురు చిట్టిముంత
పెద్దముంత మంచము తొట్టి పద్దబడద —
నడరు గుంపులాళ్ళ గుడిసె యుండఁగలదు :
కలదు ధర్మచావడి: చెంతఁ గలదు చింత.

అంతమెండను వాఁ డొక టగయఁబోఁడు
వెలికిలంబడి యింకను వలినిసణాకు
“సచ్చిపోతుంటి మాత్రోంను తెచ్చిపెట్టి
పున్నెమును గట్టుకోనుండని మూల్గు మూల్గు.—

దోఁచె నామది: “జాలిమై సి చలి సిటుగ
వీఁడు బ్రదుకంగ నేటికి వృద్ధ టంచు”—
తత్క్షణము వాఁడు స్వగత ముగా త్రమంద
ఎట్టి బ్రదు కెట్టు లగుచుండె నెవరు లేరె
నన్ను బ్రదికించు వార లన్నాయ టంచు
గట్టి కే కిడి మోము చూపట్టె నిట్టె—

అట్టి మోము వేఱొండు చూడము మఱింక.॥

తుమ్మచెట్లవెనుకఁ దాఁగరుప్రొద్దొాఱగులోఁ
బ్రక్కఁ బల్లెటెంకివంక నిట్టె
చవితిచందమామ జంట రోహిణిచుక్క
కాంతు లమరఁ గళను వంతుకెక్క

పూచిన పెద్దమ-పిడులు
పూవగెలల్ తలఁదాల్చు తాళముల్
కాచినచింతచెట్లు చిగురాకునుబోసెడు నీడచెట్లు-
ఎంతో- చిరకాలమైతి నను దూరముల్తై యిరుగ్రేవఁగాలువల్
జూచుకొనంగఁ జెల్లెడిన పోకెడు సుందమరుత్ప్రసన్నతల్

దక్షిణపుఁబైరుగాలి యంతంతఁ దిరిగి
యెదురుపడనలఁ బెరచాప లెత్తఁజేయ
ననుసరితజనక్రమమున నైవొ యూరొ
ధవళధౌతబుద్బుదములు తేనుకుచుండె

దూరము సన్నగించు నలతో యనుదీర్ఘపువీధి
నల్ల సేపారుచు నెడ్డునొడ్డుఁ బిలు పానుక
భారపుబల్లకట్టు వెడదారి నడాడుచుండె
గడఁ దాల్చి యొకం డొాకత్రోఁపుమాత్రనే
పారెకు వచ్చిపోవు జనసంఘములన్ దరియించు తోట్రుతో.

తలిదండ్రుల్ తనచిన్ననాఁడె చనిపోఁ
దా నెందో పెత్తండ్రింటిలోఁ జెలియల్ పెత్తల్లితోడ నిల్వఁ
బెఱుగక జెల్లించినారంట
యొండొరులన్ గన్నులారఁ జూచినారో యిరువదేండ్లుగ —
పెండ్లియై పెద్దయై చెలియల్
దాపున నత్తయింటఁ బతితోఁ జల్లంగనుండఁ
దా నలకర్ణాటమరాట దేశముల విద్యన్నేర్చి
యుద్యోగియై తలవంచంగను మోమువాంచి యొకఁడై
సంసారి కాకుండ నందులఁ బ్రాయంబును బుచ్చినాఁడట
—"ఇకెందుకు వచ్చితే నంట"—
ఈ తెలుఁగుంబుట్టిన వాఁడె యుమ్యునది యేతిగోనదిం చేస
ఊఁ— —పలవించున్ మది
నాకెక్కళ్ళ గుఱుతుంబట్టంగఁ
దోబుట్టుతాఁ దలక్రిందుల్ పడినట్టి చెల్ల:—
అపుడే తగ్గించు మాతృస్మృతిన్
కులుకున్ సేవను మాన ;
నావ యుపరిం గూర్చుండి
యంతంతదవ్వులఁ జూపట్టుచుఁ బ్రాయు
చేలఁ బనులన్ బొంచున్న పాలాల
లోఁ దలపోయున్ ;
తలపోయుఁ జుట్టు నుడి నాంధ్రంబెందు విన్పింపఁగఁ.

## ౫

నా వెనుతట్టుఁ దప్పెట వినంబడె
నిట్టి కనుంగొనంగ వెన్త్రోవను జూచితిన్
వడి నిరూపణ సేయఁగ
బంధువో సఖుండో వరభాషి యౌనో యనుచు నూహాలు బాఱెను:
కాని బాలుఁడే !
తా వడి వీధి నాడుచును దప్పెటఁ దట్టెను
నాట సందడిన్.

    నన్నుంచి తలచుకున్నను
    వెన్ను తెలవు నేను జూచు వేసుక లేలా?
    అన్నా! ఆ తప్పట కా
    కన్న నులుకు గొలిపి నింట
    ఘనప్రతిగుతమున్ మిన్నంకఁ దోఁపఁజేసెను
    ఉన్నే నసుబిలువకుండ
    నొంటరి జను నన్.

## ౬

నంతలోఁ గొన్న యొకగ్రొత్త ముంతతోఁడ
మల్లికోళ్లతో మిర్చితో నువ్వుతోడ
నెల్లవస్తువు లోకగంప నెత్తుకొనుచు
వెళ్లుచుండె నింటికి మల్లి పిల్ల యొర్తు

చెఱుకుతోటప్రక్కఁ జిన్ని కాలువయొక్కఁ
జేనుకోసినట్టి కోనఁ బడిన
యడ్డదారిఁ బట్టి యరుగుచునుండ
నా పిల్లయోర్తు వేగఁ బల్లెఁ జేర

ప్రొద్దుగ్రుంకెడు
నీరెండ పొడుగుచెట్ల నిల్చినట్లుతెనిల్చి కోమలతఁ బూసె
పక్షిసంతతుల్ కూసెను
వాతపోత మల్లనల్లన శీతలం బగుచు పోక.

పల్లెఁ జేరు దారివైపు నే నెఱుఁగమి
నెట్లు పోవు- త్రోవ యేది యంటి
తనదు వెంట రాగఁ గనఁబడు ననెకదా
చిన్నిపిల్లయయ్యెఁ జిరునగవున
నన్ను గ్రొత్తగాను నెన్నుచుఁ
దా నెంతో యల్లపల్లె చక్కఁ నెఱుఁగునట్లు
గరువమడర నన్ను గట్టుగట్టును ద్రిప్పి
తుదకుఁ బల్లెఁ జేర్చె దొడ్డపిల్ల
అడిగె నెవరియింటి కనిచెప్పి
యెందున్న నాదు చుట్టములను మోద మొనఁగఁ
దాన యెఱుఁగునట్లు తలచి మాఱడిగెను
చెప్పునంతఁ జూపి చెప్పె నిల్లు.

పిల్ల తనదుదారి వెడలెను
నాదారి నేను జనితి.
కాని యెంతయెఱుక కలదివో లె
పిల్ల కనుబొఱ్చెఁ దనపల్లెననెడు-
పుట్టు తెలివి యాత్మ నిలిచె.

౭

ఆపల్లెనాపల్లె యాచనముఁచేసి
మాపల్లె కొక్క-బ్రాహ్మణుఁడు దా నచ్చె.
అతనిజీవిత మారయఁగ నచ్చెరువు
మతిగల్గి యొకకొన్ని మతిలేక కొన్ని
పనులుచేసెడుతీరు -పరికింపఁ బాడవు
వినువారికగమెల్ల వింతగఁదోఁచు

చుట్టుపట్టూళ్లలో శుభము నశుభము
దిట్టతఁ దిరుగుచుఁ దెచ్చును ధనము
తెచ్చినయది బొడ్డు దగ-కొంగు గట్టి
మెచ్చుట నెప్పుడు నేమఱఁబోఁడు
ముమ్మారమునఁ గాసు ముట్టి లెక్క-పెట్టి
సుమతి నేనాఁడో మాసామ్మ సర్వమ్మ
నంతర్పణం బంచుఁ జాల వెచ్చించు.

ఎంతయుముష్టెత్తి యింతంతచారు
లెన్నియో గడియించి యెల్లను దాల్చు
వన్నెచిన్నెలు మీఱ వానిని మెచ్చు
మెడ కొకరెండింటి మేలేర్చి వేయు
నడుమున కొకరెండు నయముగఁ గట్టు
తలకొకరెండింటి దలపాగ చుట్టు
మెలపు వానిని విప్పి మిగులంగఁ గోల్చు
పెండ్లిపేరంటంబు పేరెత్త డెప్పుడు
దిండ్లు పరుపులపై దృష్టియే లేదు.
ఒకప్రాఁతయింటిలో నుండుఁ గాపురము
సకలసంసారంబు సాగించువాని
కంటె యాతనపడుఁ గనుఁ దుడ్చి యలికి
యింట ముగ్గునుబెట్టి యివియవి యంట్లు
తోముకొని వండుకొని శ్రీరంగభక్తి
సామిఁ బూజించుకొని సరిఁ బ్రొద్దుతిరిగి
పోయిన తరువాత భోజనముచేయు
ఏయెడ నెవరైన నేమండి యన్న-
ఒకమాఱు నవ్వుచు నొప్పుగఁ బలుకు
నొకమాఱు చిట్లించి యొప్పరికించు
వీరువారనకుండ విశ్వంబు నెల్ల
సారెకు దూషించి సన్నుతిఁ జేయు

కోడికూయఁగ లేదు కొంత సేపింక-

పాడక 'నిద్రిస్తు' పానకాల్" అనిన

ఆకోడి కాకి మిమ్ములచి మేల్కొల్పు

నా కేటికవ యున్న నాకెస్ట తెలిసె

యని మాతఁ డాసు నే నద్దానికింక

నననేమి యున్నది? అతిభక్తి నహహా!

దేవుని లేపెదు తెలి పతనికుండ

నీవేళ నావేళ నేటికిఁ దలఁప?

౭

కోయిల! యూరకే మొటకొ కూయుచుఁ బోయెద వేల?

ఆగు—

నీనేయఁగనైన కార్యమును జెప్పవఁ జెప్పని చేయునన్న వో-

ఆయతమైన కూర్మి నిలుపంగ సనంగి పసంగి

పిమ్మటఁ గాయఁగలేక మొండోయిలఁ బోసి

దవున్ జరియించు భర్త నాప్యాయముతోఁ దలంచు

నలభార్యకు వాదోకపల్కుఁ దెల్పుచూ!

తుచ్ఛవినోదనాదములతో మితిమీరు తెగను పట్టరాంబు

నందిచ్చకురానిజీవనము నేటికి నిర్వ్యర్థఁ బుష్టు? చూపు!

నుస్వేచ్ఛఁ జెలంగు జానపదవృత్తులతానవళి మారుతంబునన్

స్వచ్ఛరుతంబు గొల్పి

మనసంగతులన్ విశదంబు సేయుచూ!

ఇక్కడకెంతో దూరమని యెంచకు మార్గమునందు నెల్లెడన్
జక్కని చెట్ల కెంజిగురు చల్లని కాలువ నీరు గ్రోలుచు
వన్నెకెక్కిన యూఁదప్పుచేలు
మొవ్వులేయు వసంతుఁడు
కాయుకొబ్బరుల్
మక్కువెసంగఁ గన్గొనుచు మానిని జేరెదు నాదుసాంటలో.
ఎచ్చటనుండునో? కలికి నెవ్విధఁగాంతునో
యెట్టివేళ నెమ్మచ్చునఁ జెల్పనౌనో యని
మానసమందునఁ గొంచఁబోకు
నానచ్చినమచ్చకంటి
నొకనాఁగరభర్మరమాస్యహర్మ్యమునఁ గచ్చెరువాచుఁగాక
యరయుందగు నీమునుముందె నిచ్చలున్.

కలదొక చిన్నిపల్లె కలకంఠము !
చైత్రవికాససంపదన్ జెలఁగెడు చెట్లగుంపులకుఁ
జేరెడు నిల్లలికంపుఁబత్తులన్
గలకలమంచు నొప్పునది.
కాంచినమాత్రన నీవు మళ్ళి రాఁదలపవు సుమ్మీ—
అందుఁగొన డాసెదు బాలరసాలసాల
మాలలితదళంపుఁగెంజిగివిలాసము జూచిన
యానవాలుముంగలనె నినాసకుఁస్యసితకాంతిని
పోరణాగండియుంచు లోపలిగది చూపు.

దాన నిశఁ బండుకొనంగను వచ్చి నాదు నెచ్చెలి నిమిరించి
నన్నుఁగని చిత్రమటంచును లేచిచూచి
వాకిలినలరించు వెన్నెలలఁ గ్రేలఁ సయ్యాగ——
కల్తనిద్దురఁ మెలకువగొన్న పిట్ట గుతి
మెందుగఁ గారెమునీరుతో డుపాటల
విని- వెండిఁబండుకొనుతావు సతిఁంగి యెలుంగఁ జెల్చు
నాపలుకులవన్ని నీదయిన స్వాదుమనోహరగీతిక గ్రుమ్మ
నీకంటిపాపలో నారూపు వెలయించి
నాకంటిపాపలో నీరూపు నిలిపించి
చూచినట్టిచూపు లెడమాయెనో వనిత!
చూపులెడమాయినా రూపు లల్లెనిల్చి
ప్రేమలెడయింపవో వనిత!
నీపల్కు తీయాన నాపల్కు మఱపించి
నాపల్కుపల్కులో నీపల్కు ముఱిపించి
పలికినట్టిపల్కు లెడమాయెనో సుదతి!
పల్కులెడమాయినా కుల్కు లల్లెనిల్చి
ప్రేమలెడయింపవో సుదతి!
నీవు నే నను కొంచు నామనంబున నెంచి
నేను నీ వనుకొంచు నీమనంబున నుంచి
కడపినట్టిప్రొద్దు లెడమాయెనో పొలఁతి!
ప్రొద్దు లెడమాయినా హద్దు లల్లెనిల్చి
ప్రేమ లెడయింపవో పొలఁతి!

సదమలతారకాంధమగు శర్వరి సందఱు భోజనంబులై
కుదురుగఁ గూరుచుండి సుఖగోష్ఠిని నిద్రకుముందుఁ బుచ్చుచోఁ
బదఁపడి దీపముల్ కొడిని భారము దెల్పుచునుండె నింటిలోన్
జదలకునంట శాంతిమయనాదము చొప్పడుచుండె రోదసిన్

మధుకరభైక్షుకుండొకఁడు మాటికి నయ్యెడ ముద్దముద్దయం
చెదురుగమూసియున్న తలుపించుక చూపడు వెత్తికాంతిలో
ముదమున నిల్చుచున్ దనదుమూకుడునన్ గలదాని మ్రింగుచున్
గదలక—

“అమ్మగారు! ముదుకన్ గబళంబొకటంచు” నార్చెడున్-

దయకలయిల్లు గంటినని తామసియున్ బనిపూర్తిచేసికొం
చ యెడఁబదార్థశేషములు సన్నివి కూర్చుక యుంజయూవలన్
వయిచుచు వాని కింత యిడి ద్వారమునున్ గడెపెట్టె.

బిక్షుకుండు గ యుసిడినట్టి దేదో తినఁగగ్రైడి దేదో
విమర్శనేయకే తినదగు చీకుదారి నడతప్పక
నల్లనిమూకుడందు వైచినయది మెక్కుచున్
సతన శేషవుటూరుప్పు తోడనే చనెన్.

ఇంకఁ జెప్పంగనేటికి నింపుగులుక
గచ్చకాయలు గవ్వలు కాళ్ళగజ్జె
చిన్నిబిన్ని త్రొక్కుడుబిళ్ళ మున్నగాఁగ
నాటలెన్నియొ మేమింక నాడనలయు.

మఱియుఁ సుందరమైనయిందుప్రతిబింబమునుఁ
జలం బందు నేఁ డరయన్
మానిని యేమెడఁ
ముసలియయ్యన్ గాక ప్రాణేశుగన్
దరుణప్రాయుని నందునంచు నను నప్పుడే నవ్వఁగా విందు
మమ్మరో నే నిందునిభాస్యఁజెట్టఁగన.
నమ్మాండ్రెల్లఁ గనఁ గోరెదన

ఈయటచేతిన్ జూచితె
యేయేడునఁగాని యింతయెట్టుగ నోరుటౌ యున్న! సత్సఖి!
చూ డీయేడున నాదుభాగ్య మేమననచ్చున

కావునను వేకువనె లేపి
నూవుపొడుము పులుసు పెఱుగు పోసి చలిది నొండుఁ బెట్టి
యాడుకో వెళ్ళుమా యంచు వీపుఁదోలిపి
నన్ను వేగిరింపఁగదమ్మ మున్న-
తల్లి!

గావచ్చును మే మూడేడు లోపునకును
నెంతయును ముదంబున జూడంగావచ్చును మా కూటల
నీవుకినియకు యింక నేను నిద్దురంబోదున్.

౧౨

అసలే స్వప్నము - అందునాటకము - అంతర్నాటకం బంతా-
చూడ సమస్తం బింక మిథ్య కాక యెటుతథ్యంబౌను?
కానీ కనుల్ విషయాసక్తిని జూచినట్టివిక దా
వేడ్కన్ గలన్ సర్వమున్.
మృషయావేసము, లాడినట్టిపలుకుల్, - ఇంపైన చెయ్వుల్, ప్రీతుల్,
మృష మెల్లైనల కాలమందుఁ గనులిచ్చన్ బొందునానందముల్.

* మేలుకొన్న పిదప నెంతొ స్మృతిని గొల్పు
సంస్మృతిన మూలమింత కనఁబడ
దొక ముచ్చటగను చెప్పుటో వీలుగాదు.
పలువురకును వింతయైన కలయటం బోలిఁ జెప్పఁబోయి
తుదకు నొక్కదాని చెప్పనే.
వేళ రాత్రిరంచుఁ "జెవుడు" వేసములని చెప్పుదున్
కూరుకొనుచు వచ్చినట్టి కుతపనిద్ర గంటినని
చారసినది చెప్పఁబోదు నంతకంటెఁ దోఁచదే
కాని కలనుగన్న నాదు కౌతుకంబు సత్యమం
చానఁ "జెవుడు" ని త్తైము నేనానందము పొందెదన్.

పచ్చనిపచ్చికల మొలచి బాగైన [illegible] గోష్ఠములమున్
వచ్చెడు గోతమీనదిని [illegible] మంగోనన్
విచ్చెడు తెల్లతెరకలు [illegible]
బొచ్చెములేని తేటను [illegible] ప్పెడిన్

నడచితి విహారమానం [illegible] ప్పు
నచ్చోఁ గంటిన్
బుడకలఁ గట్టెలఁ బుల్లల [illegible]
తీయువారల జనులన్.
స్త్రీలును బురుషులు పిల్లలు—
తెలిదరికివచ్చు తెల్లు తెట్టను గల
యే తేలికబెండైననునరే [illegible]
దాని నాకట్టుచునున్
కట్టలకట్టుక నెత్తిన బెట్టుకొనో
బుట్టలందుఁ జేర్చికో యెట్టో
మెట్టన్ దవ్వైన గల తమపట్టులకుఁ జేర్చి
మఱలివచ్చుచుఁ జనుచున్

పెద్ద యొకతీర్థమట్టుల సద్దుఁగొలిపి
లంక నెందును దామెయై
వంకవంకఁ బైకిఁ దలచూపఁబోడఁగిరి
వారిమచ్చునరయుచును నట్టి యుఁకదూర [illegible] !

బంగరుపచ్చతీఁగ మెడపట్టున హత్తి మెఱుంగుఁ జెందఁ
గాళ్ళం గడియాలు సొంపెసఁగ
లబ్ధవయోవిభవాస్పదంపుఁ బ్రౌఢిం
గుబుసంబునూనని యొఱా మొఱి
గుళ్ళను నానుకోళ్ళు త్రుళ్ళం
గతి మాయచుట్టు లోగయునె
గోమరా లగపించె నేర్పుగో

ఓర్తుక యది
తలను దనయుత్తుంగంపుఁ గొంతయేటవాలుగ
నిడుకొన్నదగుచు నడినడుఁ జను. ...
అది కోడెకాను చూచి
"మఱదలా! ఎన్నిసార్లిట్లు మఱల మఱలఁ దిరుగుదానవు?
సాయ మెవ్వాగును లేఁగ?
పుల్లలెన్నియొ యొచ్చోటఁ బ్రోవుజేసి తప్పియెల్లను
నెప్పటికొను మోయు—నిట్లు నీయొంటిసేతిపై—
నేనురానా? సాయపడుదున? యంచును సరసమాడె.

అందకత్తె నగియె
నయినప్పుడే యగు నాగరికోడు తనకు నొప్పదనుచు.—
వాఁడు మొఱసె
నెవరితో డవసరము లేక నవ్వినావ పిల్ల నగితివ? యని.

గడ్డముపకీరు గొంతిమియొద్దునఁ జనుచుండి
హిందినొప్పు సుగీతిఁ దొడ్డగఁ బాడుచుఁ
బైకది గడ్డపుటడ్డు నొకనన్నగతి వినిపింపన్

ఆతనిపాట నేనపుడు-ఆతనిప్రక్క నపోవుచుండి
సంప్రీతి మాఱువల్కకొని
తేపును మాపును పాడుకొనగ నా గీతిగ యంచు నెంచ
నెడఁ ద్రేవను మిత్రునిమాటమంటిలో
నాతరి నంతయున్ మఱచినాడను సంస్మృతిదూరదూరమై
ఇంటికివచ్చి యిచ్ఛభుజియించు నెడన్ దలపోసినాడఁ
జే ఘంటముపత్రిమీఁని స్మృతి గట్టిగనిల్పు మ
యోజసల్పితిన్
వింటిని వీనువిందుగను వేగమపోయెను పాటమాటయుఁ
'చంటునె' నిద్రవోతిని
తదాదియు నంత్యము తోఁపదెంతకున్.

"పర్సె" యనునట్టి యొక నసుపలుకుమాత్ర
మెట్టులోఁ తోఁచు: వెనుముందిఁ కెట్టులన్న
మధుమధురగీతికాద్యంతమృదులఫణితి
మఱచితి నటందు: "పర్సె" నే తెఱుచు ననుచుఁ
బూర్వాపరపద మెదఁ గొల్పి ముదము గందు.

అలముకొనిచీఁకటిని బయనమ్మై తెరచాపను—చిన్నినావ
యావలిదరి నంటి గాలిఁగొని
యగ్రజలం బిటులట్టు పాయఁగాఁ జలనముఁజూపుచుండెఁ
మృతిసదృశమహోత్కృష్టనభవ్యస్వరూపముం బలెఁ
గనుకొద్ది సూక్ష్మతరభావము నొందుచు దవ్వుదవ్వులన్

చిరతరప్రసిద్ధములైన చింతకొమ్మ నడసి
యొకటొక్కటిగఁ దలక్రిందుపడుచు తెఱకలవిదల్చుకొనుచు
నదీతలాన నగుఱుఁ జొచ్చును పగటిగుర్తెల్ల మఱచి.
దక్షిణాశాంతములయవా తాంకారంబు లేమపాయలఁ
బోనుకొం చినుకనలుఁ దీరసోపానపంక్తులఁ
దరలి తెరలి గౌతమీపుణ్యవాహిని కాంచనమ్యె.
చిట్టిపాపసిగోలిచూపు చలువు మెఱసి
యొక్కచు కొక్కక్కము క్కొంక నొక్కచుక్క యనఁగ
సాంధ్యారుణాపుఁబోక సందగించెఁ జిన్నిచుక్కలు
మింటిపై నన్ని యొన్నొ.

సంతోషస్థాయి కాల్పేస్ సకలమును మనోభీష్ట మందంగ
నేనో—చింతామగ్నుండ నయితిన్
జిరపరిచితచింతల్ స్మృతిన్ మేలుకొల్పన్

కాంతాకంఠస్థవాఙ్మయసముదిత
మనఃప్రేమసంబంధమౌనా
స్వాంతంబై భావవిస్ఫురణము
మమశుద్ధాంశురంగాన నొప్పన.

ఎఱుకతిన్న గరాని చిఱుతప్రాయమునాఁడు
చెల్లెలాయం చొకపిల్లతోడఁ
దల్లినినేమఱి కల్లబొల్లాటల నాడుచును
రాత్రులఁగలలనయిత మేమిగ్గురము
నాటనే మెలంగుచునుండి
పలవరింతలఁ బరస్పరము బిలచుకొనుచు
జోకొట్టినఁ దనిసి నిద్దురవోయి
యుదయాన నొండురు ముదముగనుచు
దినదినప్రవర్ధనంబు సుస్థిరము నైన
చెలిమి చేసినవారము- తెలియ దిప్పు డెట్లు విడిపోయినారమో
యింతి యామె యొక్క యత్తింటికోడలై యొక్క-డులనొ
కాపురముచేసి దురదృష్టకారణమున బాలయప్పుడ
తనభర్త కాలమందఁ బ్రదుకునుగ, మంతరోసి
జీవచ్ఛరంబువోలె నున్నది నేఁడు కన్నాలివుట్ట.

గొప్పవహించునాఁనమొయిఁ గొమ్మ మాతొక్క-తె
కొండపిండులఁ దప్పని నాల్గునా ళ్ళైటొచనన్.
జఱిగించుతలంపునుండ పెన్ముప్పుగ

వేమఱుగణించు నెనుఁబదిఁ బ్రేమోఁగుచు
దంతపటిమ వదలుచున్నన్.
నామాతామహసత్తముఁ డేమాత్రము సగము సేయ
కే త్తైల నొకచోన్
కునికెడుదీపముముందఱకును జని
పులకండపల్కు కొంగుచేము నోటన్ గొని
పటపటరావంబునఁ దనమంచమ్ము పైకిఁ జేరి
తఱచగు శాలుక్

ముడిఁగినమేనఁ గప్పుకొని పొందుగఁ గూర్చుని
బాలకృష్ణుదుందుడుకుపదంబు బాడుచును
దోడుతఁ దాళము వైచుకొంచుఁ
జొప్పడు తనతన్మయస్థితిని బైకొనుచుండెను
జన్మమెత్తి తా నెడరులఁ జిక్కి
దుఃఖమొకింత యెఱుఁగనివాని కైవడిన్

అప్పుడె యన్నమితిని నేనొప్పఁగ నావృద్ధుపజ్జనొఱగుచు
నింపౌయప్పాటన్ విని
గొప్పగుతదురస్థలంబు గొలఁది నిముసమున.
ఆహా! భోజనమైనదో హాయిగ గాత్రంబునెత్తి యాలగడు
నాకుఁ నీయుత్సాహ మరయ
నెంతోయగువింత యనుచు నొడివితినిట్లుఁ.

పిఱుందఁ జూడరాద టంట-వేడ్క-నేని భీతినే
వరప్రసాదుఁడమ్మునీంద్రవర్యుదృష్టి నుఱ్ఱినా
ఝురీమతల్లి యంతరించు: జాలునఱిన గాదిఁకన్:—
ద్వరన్ ద్వరన్ మునీంద్రుఁ డల్లి పాయదీసె ముంగలన్

నాసికాత్ర్యంబకనగసీమ వెల్వడి
నవ్యమహోద్ధతి భవ్యమగుచుఁ,
దననడన్ బెనఁగొను తరుమూలనిచయమ్ము
నందందుఁగూల్చి, పెన్సందడిగను
మునుముందుఁబఱువెత్తి పోలేక నిగ్గ్రంగు
మృగసంతతులయార్పు మించిమ్రోసి,
నడపాటుననుద్రొళ్లిపడి దిశలద్రువంగ
ఱాలఱాలను గొట్టి రహిఁజెలంగి,
వెనుకఁజనుదెంచువాహిని విభవ మెట్టు
లున్నదో యని
యట్టె తానన్నమాటమఱచి కన్గొనినాఁడు వనన్మౌని యతఁడు
లేదు-లేదు-గోదావరి రా దోకింత.

ఆముని క్రమ్మఱఁ దవమున్ సోమధరునిగూర్చి చేయ
"చూడకు" మనుచున్ "నీమంబుననుందుము" యని
యామఱు నరమిచ్చె
మునియు నరిగెను మఱలన్.

పాపికనుమఁ బగులఁగొట్టి
ఆపరానిదగుచుఁ దొట్టి
బొళుకుబొళుకు ముఖరితరుతి
వెలికిఁదొఱఁగి వెల్లువద్రుతి

సముత్ఫులిసంఘము తోసగుచాయల సింకుచుఁ బొంగుచున్
మొగిన్-గోమిరేఫుఁగా మినింబలెను
గొప్పగ వెంటను వచ్చుచున్న
ఆయమరనదీసమానయగు నార్యనదిన్ వినుఁడూచె వెండి
సంయమి విజితేంద్రియుండయు
'మహాద్భుతమే'యని పట్టనేరమిన్

నదిలేదు: నా స్థిరము:
మొదలిడినప్రయత్నమ్ము మునికి వృథగదా
పదఁపడి వేఁడెఁ
శివుదయనొదవెను నర దింకొకవరి నుదకము రాగన్

మునియు ముందు నడువసాగ మునికి వెనుక నదిచనెన్
ముని వెనుకకుఁ జూడఁబోను మునికి ముందు నదియుఁబో
దననరతము గోతమీమహానదీయనంగ న
మ్మునిని వెనుకన యబ్ధిదాఁక పూజ్యమౌచు నదిచనెన్.

కకుదముపోల్కి నెత్తుముడిగట్టునఁ గూర్చ్చుని
కోడెకాపు తాఁ గకపికనవ్వుచొక్కుఁ గొని
గాటపుగాదిలిమెల్గు
ను త్తరం బొకతనయుంటుక త్తె కిసుచుండెను
చుట్టినపాగ యొక్కపక్కకుఁ బడిపోవు మన్న
మఱి గట్టిగఁజుట్టక యట్టె నెట్టుచుఁ

కూరపాదులు పెట్టిన చేరువైనచక్కి
నల్లని రేవడియిక్క యద్ది:
ఆకుపచ్చను పసుపుపచ్చన పువులు
బీరపూవులు పూచెడు వేళ కూడ:
కొత్తిమిరిసుగంధారోగ్యకోమలంపు
గాలి వీచెడు కడచెక్క గంధవాహుఁడు:
నూగుటాకెల్లపూవులఁ దూఁగునట్టి శనగ
నేలంటిచల్లిన చాలు వెరయు:

అమ్మధ్యసీమ మూడే తుమ్మలు కొమ్మలనువిరిసి లోడరు
నొకటిదూర వొమ్మక టింకనుదూరము
నమూహ్మడవ దిఁకదూరమనుచు సంచన ననుకో

వానికంటె దవ్వువట్టున నొప్పను మేయుమిగులుగడ్డి మేటిబణుపు
అంతకంటెదవ్వు నంతంతవైయొప్ప నష్టదిశలఁ
తాళవేష్టనంబు

అయిన నత్యంతసామీప్యమందు నుండుఁ
తెలిపిసాలినవ్వులు పిన్నచెలుని దెబ్బ:
నాతఁడు తనంతకనంబనుసలరు బుణేకి వైచినాడుగ
చెలిమోము ప్రక్కకిడఁగ

ఔరా! జవ్వని రెప్పపాటులను
నత్యాస్థానమూహించుమనసు - పేరంబారఁగనవ్వాకొంచుఁ
దనకొన్ ప్రేక్షన మనోజ్ఞంబు ద్రవారన్
దూర్వాపుటంకురంబు బెలుకుల్
బాణిప్రగల్భక్రియన ఘోరంబై కలకంకణాక్వణము
తోడ్తో ప్రోత మార్గోగ్రియుఁగన్.

కేవలపరస్పరంబై సాహిలసనచేష్ట లొప్ప
నండను శిసగసి బూవాకుపులును చవిఁగొను
చావును వెంటాడు స్లిఁ డరయుడు కించి
త్తావెనుక యొగుబిడకల ప్రోవును శిర సూని
క్రుంగిపోవును వృద్ధస్త్రీ వారిఁ జూడనేరదు—
కానలసినదదియ యుల్లకవ కచొట్టుల.

అరుణతఁదాల్పుముందు నవరాత్ర్యుఁజను ధూమ్రమతిసొచ్చుచుండ
నత్తరి నలలేక గౌతమి యథావిధనున్నది
గోసమూహముల్ దరి దగతీఱుటన్ నెమరు దౌడల నిల్చెను:
గొడ్లవాండ్రు వేళరయుచు నాటలన విసివి
యుండను దోఁచకకూరుచున్నవా
రొఱయిక తెల్లు సాలిపురుగుంకుసఁ
బోఁచమొఱుంగు లీనెడిన్.

ముడుతలువడు తెరచాపలఁ బడవలు
నట్టేట గాలిపడి నడకసెడెన్: గడలెంక నైదినను
గనఁబడు కాలువ మొగలు చేరు భాగ్యము గనవే
సామాన్యవిహారపుగడె కేమో నొకింత
ముందతే తెంచుచు నాఁడామొయిఁగనుఁగొంచు సముద
నేమార్గము లేని లంకయిక్క నిలిచితిన్
వేసఁగివచ్చెడునను నెద మోసులనిగిరించుకొంచు
మొలచెడుపసితోఁ గాసిలు పులిసస్థలి
యవాసితము పెద్దబయలు వట్టిబయలయినాఁడన్.
కానీ తన్మధ్యంబున జ్ఞానార్థము బెత్తిగినట్టి నత్తపసులన్
ద్రుమానులుగట్టుచు వృత్తిముత్తైన
సుబోధిద్వయమ్ము నరసినవాఁడన్

ఆనిశ మోహనాంగియగు నాలిని బుద్ధులఁగూర్చు పుత్రు
సుజ్ఞానముపొంకె పిడి
వరసాఖ్యమహీపతి సూనుఁ డస్మహీనానిఁ
దపం బొనర్చుటను సత్పథి సప్తపథిన్ గ్రహించి
నిర్వాణముజెందినా డనుచు
బౌద్ధమతాదిమదీప్తి నెంచితిన్.

## ౨౦

సన్నని తాలచక్కినడిచాలునఁ బ్రాకుసు గట్టి పచ్చని
తన్నారయంగ లేచు తృణదర్పము నంచును
గుల్కరాళ్ళలో
విన్న తెఱంగునాడుచును స్వేచ్ఛగఁబోయెడు
సోనజాలు నాకన్నులకింపు గొల్పె
నయగౌరవునాగరికంపుఁబొందుగన్.

తెక్కలయులిపారజిగితో నొక్కెడలప నిలువఁబడుచు
నొక్కెడ భ్రమణం బక్కజముగఁ గనఁబడుచుఁ
జక్కనితూనీగ యొందు ఝంకృతివినాలిఁ

వయివయి జాలుపై జిలుఁగువన్నెలొలుకున
నీటిఁజేరుచుండియుఁ దగులంగఁబోక

# ప్రబోధ సూక్తి

"— తెనుగు కవిత్వమును క్రొత్త దారులలో నడిపించడమునకు ప్రయత్నించిన భావకవిత్వ ప్రక్రియలలో తొలుదొలుత బయలుదేరిన వారిలో వెంకటరావుగారొకరు —"

సుజన రంజని.

—అభినవాంధ్ర కార్యస్థాన సుప్రకాశితము—

—అక్షయ—

*

—సర్వస్వామ్యములు వీరివి—

వెల ౧– –౦

*

అద్దేపల్లి లక్ష్మణస్వామినాయుడు గారి
సరస్వతీ పవర్ ప్రెస్సునందు ముద్రితము
రాజమహేంద్రనగరము

# అంకితస్మృతి

నేఁ జదువుకొన్న

1909-1913 కళాశాలకు—

" A spring of graceful fancy
breaking sweetly in the desert of
College Exercises
first made us friends"

"కళాశాలాకార్యక్రమమను నెడారిలో
తియ్యందనాన వెల్లివిరిసిన
ఒకానొక యొయ్యారఁపు టూహాస్రవంతి
మాయిరువిరి నెయ్యమునకు నాదికారణము"

*South Indian Hours.*

౧

కృష్ణపక్షమున,
నిశ,
వెన్నెలనిరాశ,
నెంతో పెద్దనల్లనిమేఘ మెచటనుండో మూసికొనివచ్చి,
చుక్కలరాశిఁదుడిచి,
కన్నుకన్నుకనఁబడని కారుఁగ్రమ్మె.

నామదిఁదోఁచె నొక్కటి ఘనమ్మగునయ్యెరులన్ గనన్;
—తద్దైకామృతధారవోలె, వఱదందుక తొట్టు,
నదీజలంబు లీయామిని నంధకారమున నాగక,
వెల్లువ జాలువాఱునో?
ఏమిటి కంచు
నయ్యవియ యెక్కడివక్కడ నిల్చిపోవునో?—

ఒకనిముసంబు సుస్థిరత యోజన సల్పితి:
వీనుదోయికిన్, దోకతోక, నీరనాళమునఁ,
దోయదనిర్భరమారుతశ్రుతిన్ వికలముగానిదై,
పెరసి, విశ్రుతమై, వినుకొద్దిస్పష్టమై, ప్రకటితమయ్యె
నిర్ఝరిణీరావము వారిధికంభపంక్తినే.

స్వాదుతరమయ్యెఁ జీఁకటిపట్టునందు
దూరదూరమై వినుచు నన్నీరరవళి. అహాహా !
తామసహృదయజన్యప్రశస్త జానపదగీతికలకంటె
స్వైరమగుచు. ||

౨

కాఱు నల్లని మబ్బు
కనఁ జీఁకటగువేళ, గండుమూపాన దిఙ్మండలమునఁ,
బశ్చిమదిశ,
రవిపడ్డపాటున నిల్చె:
దానిపై నెలవంక కానుపించె:
ఒక చిన్ని చుక్క
పాయక నుంతిదవ్వయి, చుక్కలఱేనికి జోడుగాఁగ,
మినుక్కు మినుక్కనుచుండె:
మిగిలినదెల్లను, గాలి వెలుఁగు లేక,
కనుకొలంది నిశ్చలమయి మాఁచు,
నిమ్మకునీరోసినట్టుల యొప్పారె నలుకు డెడసి:
శాశ్వతంబుగఁ దోఁచె:
నా సర్వదృష్టి చారుసత్యప్రతిష్ఠ గోచరమునయ్యెఁ:
చిఱుత నెలవంక తనికెడు జిలుఁగు చుక్క
క్రింద నీలంపునీటి మ
బ్బెట్లు సతమొ!? ||

# ౩

"చిన్న మెఱుంగు గుల్ల !
దరిఁ జిట్లితివే యిటు కాలఁ ద్రొక్క !
నె ట్లున్నతభంగతాడనమహోద్ధతి నోర్చితి వీవు ?"

"బాలకా !
ఖిన్నపడంగ నేల? పరికించుట లెందుకు ?
నీదునాటలో భిన్నమొనర్చి,
యిప్పుడు వివేకముతో నను జూచువాఁడవా ?
మున్ను సముద్రగర్భమున మోదమునన్ నివసించి,
నీటితోఁ,
గ్రొన్ననవంటి యన్నురుగుకొట్టుకొనన్ మిసలాడు
కాంతితో,
నన్నెల పెంపుతోడ,
మలయానిలలోలవిలాసవైభవ ప్రోన్నతితో,
నఖాతపరిపూర్ణ మహామహిమంబుతోడ,
నేనున్న తెఱంగు
నే నమెడ నూనుచువచ్చు క్షణక్షణప్రభన్
గన్నులఁ గాంచినాఁడ వెటు కావొ—అటే—,
ఇపు డిందు నేను నీ యిన్నడ భిన్నమైన, మది నెంచకు,
ఛేదజీకంబుదాన నే. ||

మంగలికుఱ్ఱవాఁడొకఁడు మక్కువఁ
బ్రాఁత సనాయి జోడుపై,
బాంగురుతంబు, సన్నసుతి, పుట్టుచు, గిట్టుచు, నట్టుకొట్ట,
గాలిం గడు బూరటించి యొకలీలను, బట్టుమి నొక్క లీలఁ,
బాడెంగద వాని యింటిపెఱటిన్
నడువీధికి మాఱుమ్రోయఁగన్.

గొడుగటు లాకు లొత్తుగను గూడిన గుజ్జుతురాయిక్రింద,
నయ్యెడ, నిలుపొంతఁ బొంచి, యొక వృద్ధవితంతువు
జంతికొక్క టమ్ముడువడ కట్టె యుండఁ,
దనముం దది పెట్టుక, పుట్టెడాస వేచెడు;
నొక యీతకుంచె వెడ నిట్టటు నీగలఁ దోలుకొంచు.
నాబిడకు వినంబడెన్ సరసఁ బిల్లనిపాట
దినాంత రాగమై

సాయమునందెవేళ చలి సన్నగ వైవను
చెంగు జేర్చుకొం చాయవ వించు వించు,
మనమం దది యెట్టిదికాఁ దలంచెనో?
“ఓ యయ! పాడుచుంటివిర! యొప్పుగ!
నాదగు పెండ్లినాఁడు సన్నాయికి నిన్ను బిల్వవలెరా!”
యని యాడెను, నిస్పృహాస్మృతిన్.॥

ముసలి తాత యొకఁడు
ముందుఁ దాఁ డెంతయో శ్రమ వహించి లాగి సాగుచుండ,
త్రాళ్ల నినుపపడవ
నీళ్లకెదురు మెల్లఁ బోవుచుండెఁ, గాల్వపొడుగు మఱచి.

అతని చిన్నిమనుమఁ డావెన్క—
చుక్కానికడలఁ గూరుచుండి,
కడవ నున్న చల్దిఁ గుడుచుచుండి,
తలనెత్తి కెడమచేఁ ద్రిప్పుచుండె దాని నప్పుడప్పుడు.

గాలి లేదు :
చాప జాలరువోలెను వ్రేలుచుండెఁ గొయ్యఁ బెనచుకొంచు,
వెనుక ముందుఁ బడవ
వేఱొండు లేదయ్యె; నీటియందూ దానినీడ తక్క.

ఈఁదు గేదె యైన-
ఎంచి తలఁగిపోవు; దాని కడ్డుపడఁగఁ దలఁపఁబోదు:
పడు చొకర్తు
దానివైపునఁ జూచుచు ముంచినట్టిబిందె ముంచు మఱల:

పడవ నడక తీరు-
పడవ లాగెడు తీరు-
పడవ బరువు తీరు-
ఎడఁదఁ గొల్పి, వృద్ధు నపహసించి, బిగ్గఱ నేనంటి-
"ఇట్లు పోవఁ జేరు టెప్పటికని"

కుఱ్ఱవాఁడు
పలికెఁ గొసరెడునగవుతో
చిటికలోన రేవుఁ జేరమ యని
వృద్ధుఁ డూఁచు త్రాటి విసరున
ను స్సని-
ఎప్పుడైతె నేమి యేటి కనియె. ‖

* ౬

అసురసంజను - చుక్క - అగపించెను
అపరదిక్సతి - తిలక - మనిపించెను

పిట్టరుతములు - చేల - వినిపించెను
కట్టకడపటి - పల్కు - కొలిపించెను

ఏరు నిండ - నీరు - ప్రవహించెను
ఇసుక తిన్నెల - వ్రాలు - మోహించెను.

కార్తీకమాసచంద్ర స్ఫూర్తికి నెడమీరాయఁ
ద్వరితముగఁ గెంపుజిగిన్ మూర్తిని బెంపొందించి,
ముహూర్తములో నర్కబింబ మున్నటె క్రుంకెన్.

అంత్యసంధ్య యొకింతసే పాకసమునఁ జెదరి,
క్రింద నదీతలసీమపైని, దనదు ప్రతిబింబరక్తిమ
తనుకఁజేసె, వాయుపోతంబులు దదర్హ్వాభాతి వీవ.

జయగణ మార్కండేయాలయ ఘంటల మ్రోగుచుండెః
లక్షించి వినన్, జయశంభో యను నుతి
యాలయ సుప్రదక్షిణములఁ బ్రస్ఫుట మయ్యెన్.

వాసరముగూడ నది సోమవాసరంబు;
సకలజన మాలుమగలును
నొకరి వెనుక నొక్కరిగఁ బోవుచుండ్రి -
అం దుదకమాడి
గాత్రమీరాత్తోయముల తేఁటఁ దీతఁ గనుచు-

వారి కెదు రొకండు వచ్చెడు
బాటెండు - —

కూలినాలి కెందొకుదిరి, యపుడె పుట్టగోంచి పెట్టి
పొట్టపోసికొనెడునట్టులఁ గనుపట్టెఁ బొట్టమెత్తు.
వాఁడుచేతఁ గొన్ని వాసించుతేఁగెంపు మేల్గులాబిపువ్వుల
మెలపెసంగ గుత్తులుగను బూని కొనిపోవుచుండెను;
ఏరి కొఱకో?
అల యొయ్యారి యెవతె తలను దువ్వుకొనుచు
నలపూలు తుఱుముక శివునిదర్శనంబుఁ జేయనెంచి
వడిగ వాని బంపి చిడిముడి నున్నదో?
కుట్టి తనకు జీమకుట్టినట్లు - ఒక్క - ఒక్క - అడుగు
లెక్కించుకొనుచును బోవుచుండె మెల్లఁ బూవులు గొని;
కొనుచు నంతలోన -
కూనరాగము నెత్తి మోహానంపుఁబాట ముచ్చటాడె:
కలదె వానిమదిని నెలకొన్నయొకకన్నె
వలపులేని వట్టిపాట కాక?
అంతలోనఁ గనియె
యజమానురా లాపె వచ్చుచుంట దవుల,
శాలకుండు పాట మాని మందపదవృత్తి మానుచు -
పఱుగుఁ బఱుగుఁ బోయె నెఱుకవడక -
కాని నాదుడెంద మానాటిసుమవహు నర్మగీతికతన
నైజరాగ మొందు గూర్చుకొనుచు,' నూహింపఁజొచ్చెను
ప్రణయ సార్థకమగు భావమేదొ?॥

పటి కోయవ్వ! యింక నీవిందు మసలుచున్నదాన
వదేమిటో యుండి యుండి చెఱగుకొనుచుంటి
నూర్చివేసిన పొలాన?

కళ్ళమైపోయె:
నేమియుఁగానఁబడదె నీదుదారిద్ర్య మిందు గణింప;
నకట! వృథగ శ్రమపడుచుంటి వో వృద్ధురాల!

బండ్లమీఁదను దోలించి
వడ్లరాశి దద్దళపుగాదె నిండించెఁ బెద్ద కాఁపు:
కోత నూర్పుడు కూలీలు
జీతములని కట్టలెల్లను కొట్టుక యట్టె చనిరి:
మిగిలినది యింత యుండిన
మొలపుఁదుడిచి యింటిమాలది కొంపోయె మంటికంట:
దోచుకొనిపోయిన విధానఁ దోఁచుచుండె నట్టిదయి యీస్థలం

బెందుఁ గట్ట! నీకు దొఱకునది యేమి?
యూరక కఱకుటెండఁ గాసిలుచునుంటి
వివార్ధకమున ——ననుచు

నొంటరిగ నొక్కచోఁ
బొల్లు నొకటఁ జేర్చి చేట నూదెడు ముదుసలిస్త్రీ నొకర్తుఁ
గాంచి పలికిన,

నాపై వికాస మూని
మాపటికి నివ్వి నాపొట్టమాత్రమునకుఁ జాలవా యంచుఁ
దనయొడిఁ గ్రాలుచున్న ధాన్యమును జూపి, తెలిపెఁ
బేదఱిక మనక:

బాబు ! నేనును నింకిందు వదలివేయు ప్రాలుమాలినతుక్కు
నాపత్తు లెల్ల పడయఁగల వాత్మభుక్తిని వలయునంత:
అమలసంతుష్టికల్పకం బలరునట్టి
నాదు జనపదఫలిత మనంత మనుచు.

౯

మునుముందుఁ గ్రుంకెడు ముదుసలిపొద్దు
అద్దరినీళ్ళలో నందగించెడిని,
చిన్నారి మాతంగి చెంగలిగడ్డి
తడుపుచు దులుపుచు దరిని బెట్టుచును
ఇద్దరినీళ్ళలో నింపు వహించె,
నీళ్ళలో వారల నీడలఁ జూచి
కడసంజగడియల గడపితివింత,

వర్చస్సు గోల్పెడుఁ బడమటిపొద్దు-
స్వచ్ఛతఁ జూపెడుఁ బచ్చనిగడ్డి-
అయినప్పటికి నాదు నాత్మ- అదేమొ ?
నీళ్ళ నల్లాడెడు నీడలఁ దగిలి
చిన్నఱియలకల్కఁ జెందె ముదంబు !

## ౧౦

ప్రొద్దునే పట్టినట్టి యా పెద్దముసురు
పట్టినది పట్టినట్లుండె వదలకుండ;
రాత్రిపడి చీఁకుచీకఁటి క్రమ్ముచుండె;
రాజమార్గంబు బందమై పాఱముకొనెడు;

పచ్చగడ్డి మోపుల తోడఁ
బలువురాండ్రు నిలువఁబడినార లంగడి విలుచుకొంచు.
వారిలో వృద్ధురాలోర్తు కోరసిల్లి యాత్రమున గేకలిడుచును
నందఱఁ దనమోపు కొనఁబిల్చు:
వారిమున్ముందు బెట్టి మంచిమోపను: కానియే రెంచి కొంద్రు?

చీఁకటిఁకఁబడె వానచీకాకు హెచ్చె,
నేరిఁ గొనువారిఁ గాంచ దావృద్ధురాలు.
ఆపె మున్ముందు మోపుతో
నాసకొద్ది వేచియుండెను: కడసారిఁ జూచి పోవ;

అంతలోఁ బెద్ద యాఁబోతు, మంతనమున వచ్చి,
మోపును బెఱికి, కొమ్ముచ్చుపడఁగ, మేసిపోయె
నెవ్వరు కల్గఁజేసికోరు: వృద్ధురా ల్సుంతయు న్నేరదే మఱల్ప

చిమ్మి పాఱవేసిన చినిచిన్ని కట్లు చేతఁబట్టుక,
చీఁకటిరాత్రి వాన నేడ్చు చింటికిఁ బోయె నావృద్ధురాలు

ఓసి! సింహాదిరప్పన్న! ఊఱుకోవె యంచు వెన్గూలివాఁ డనె:
ఆఱున క్షుధ?

## ౧౧

ఓ! గోపక!
యవతారము రాగంబున నెత్తుకొనుచు రంజిలుచుంటే!
నీగోవు మేఁత
చెంగట సాగ నెదుగుపచ్చికలను -చక్కఁగఁ గనుచుఁ!
నీవు తలంపవుకద యేతావున గూర్చున్న యదియు:
తావకపీఠం బో వల్లవ!
ఎవ్వరో చనిపోవంగట్టిన సమాధిభూమ్యున్నతమే!
నీముందుఁగల ప్రదేశ మ్మేమృత కాయమొ
యనుదహియించినదగుఁ జూ! ఏమాత్రం బెఁదఁ గలచదె?
నీవాదము నీదె యనఁగ నెగడెదు వౌరా!

అదియే సమ్మత మౌఁబో!
మదిఁ దలపోసినకొలంది నాకటు తోఁచుఁ
వదలఁదగు రుద్రస్థలి ముద మొదవించెడిని
నిన్నుఁ బొడగాంచు తరిఁ.

కావలసినవారి కన్నీరములవెచ్చ, జల్లార్ప
వాన యీచాయఁ గురియు:
అగ్నిసంస్కార మహాపరితాపంబు తీఱ
మారుతము లీతెన్ను నొలయు,

సంచయనసమయ సమ్మార్జనవిషాద మడఁగ
శాద్వలము లీవెడఁ జెలంగు :
చేసిన కర్మనశేషవిపాకంబు తుదిముట్ట
గాన మీఁచదును బఱఁగు :
చల్లనగుచు, దిగంతసంచార మగుచు,
గోభజిత మగుచు, భవత్సుగోష్ఠి యగుచు ;
రుద్రభూమియె యిది సమున్నిద్రమైన తావు కాని ?
యో ! గోపాలధామ ! తలఁప !

౧౨

మింటఁ బశ్చిమమునఁ గంటి' కింపగు
శోభ,
నెఱుపులోఁ బ్రొద్దు కుంకెడిని వడిని :
అంతలో
నా యెత్తు నందంబు చందంబు పంటకాలువనీట.
బ్రతిఫలించుఁ : బ్రతిఫలించునో లేదొ
యతిసమంచితవృత్తి మందమారుతము లందంద,
కలచుఁ : గలచిన పాటునఁ
గడనున్న నామది సరసకవితాభావ సౌఖ్య మూను ;
సౌఖ్య మూనినయపుడ యాశాంతమునను తన్మయుఁడనౌచు
గందు నస్తమయతమము : విందు రాత్రినిశ్శబ్దంబు
విశ్రుతముగ నీటికిని గాలి కందని నియతి మెఱయ.

వినెడుకొలందిఁ దీయమయి, వీనులఁ జొక్కుడుచుండె
సారెవిన్నను విసు. గీనదే సరళనాదసమార్ద్రమె
సంజ- సంజ- నేను నడనునుండి క్రమ్మఱుచునుండగ
వారలు గడ్డినమ్మియో పనిముగియించియో
వడిగఁ బల్లెకొ యిండ్లకొ పోవుచుండఁ ద్రోవను,
గనుజీఁకటం దెవరియంతన వారల మేగునంత
ముందిఁకఁనొక దవ్వు నుండఁగనె
తోఁచకెలుంగమరించుకొంచుఁ, బాటను గొలిపించి,
పక్కిఁజనుతావునఁ గోకిలకంఠమాధురీస్వనమటు
స్థాయిఁ బెంచి,
యలచాయినె దవ్వగుచున్ సమాప్తమౌ,
జనపదకామినీ మధురసాంధ్య సుగీతిక
లింపు నింపుచున్.

నడరహ నెమ్మహూర్తమున నా కవి విన్నదు
నమ్మహూర్త మం దొడలు రసప్రవృత్తమగు:
కొయ్యన నయ్యది సన్నగించు నప్పుడు
స్మృతిపోలెఁ బైకొనుచుఁ బొల్చు హృదిన్ సతమున్ సశేషమై
పడఁతులు మాలవా రయినఁ
బాటకు వర్ణము వృత్త మున్న దే?॥

స్వస్థలామృత సౌఖ్య సంపతితుఁ డగుచుఁ
దలఁపు నిది యెల్ల వింతగఁ గలచుచుండ,
నేరు లేనట్టు కేరున నేడ్చువాఁడు
భూతలానకు శిశువొక లాతివాఁడు.

ఒక్క మో మిందు నారసియుండమి, నతఁ
డందఱిని గ్రొత్తఁ జూచుచు సందియపడు:
ఇన్ని భాషల నొకటైన నెఱుకపడమిఁ,
బలుకు నతఁ డేదియెదియొ యవ్యక్తముగను.

ఎవరికెటు చేయి వెలిఁబుచ్చ నేమొ యనుచు
గుప్పిలిని బట్టియుంచు నిగూఢముగను:
మెత్తనగు కెంపుటంజలి మెలఁగజంకి
నడలు దెలియఁ గోరుచు వాని ముడుచుకొనెడు.

సాధు లోకము!
అతని సుస్వాగతమున సత్కరించుచు
దరహాసచంద్రికాంకురంబు లీరికలెత్త,
ముదంబు నెత్తి,
గాన మొనరింపనగును నీ కరణి నెఱుఁగ.

"ఏడమెసునో నీకునిద్ది యపూర్వముగను: కాదురా యన్న!
ప్రాఁతదా మేదిని యిది
ఇచ్చటే నీకుఁ దెలియఁగ వచ్చువారు
తల్లిదండ్రులు వలయుబాంధవులు చెలులు.॥"

౧౫

వ్రేళ్ళు పెల్లగిల్లి,
పెద్దగోదావరిఁ వఱదకాలమందు దరిని బడ్డ
రెండు పెద్ద చెట్లు
మండువేసంగిలోఁ జిన్నిపాయయందుఁ జీకువాఱు.

ఆచెట్లఁ మునుపొక్కనాఁడు గని
పద్యంబొండు నేవ్రాసితిఁ.
ఏచెట్లో యిపుడెంచ నాకులెవి? ఏవీనీడ లేదీరుతం?
బాచంద్రార్కము బుద్ధ సంస్కృతిని నూహాఁ గొల్పు
బోధిద్వయీప్రాచీనమ్ములు
చాపకట్టుగను, నేలఁగూలి జీర్ణించెదుఁ.

విపులస్కంధము పాకుడుఁ గొనియె:
వేవేల్గొమ్మ లాకారమాత్రపుఁజూపు ల్బచరించుఁ:
బీచువలె వ్రేళ్ళ న్దారముల్ వ్రేలి తీరఁపునాచుఁ బురడించు:
నీరములఁ దేలఁ దూగు రెమ్మల్
రీసృపముల్ పోనిక సాగి నీచుఁగొను:
నాసిఁజూడ డొక్కండటుల్.

పద్దె మొకదాని మున్ను నేవ్రాసినట్టి వాసనన్: ఏమొ?
నామనం బాసఁ గొనియె;

ఆనడిచెట్ల నంతంతఁ గంటి
నీలవాతావరణమందు నిల్చి నట్ల.

౧౬

పచ్చనిసస్యరాజము! విపంథను రాత్రివేళ
నూరకే యిచ్చమెయిఁ జలించుచును,
నింపు వహించెదు వేమిచెప్ప !
నీముచ్చట లెవ్వియో తెలియ
మోదమెసంగను మేము దీపమున్ దెచ్చుటఁజూచియా
తెలివితెచ్చుక యట్లు రహించుంటి వీ

వనుచుఁ
నేఁ జనుచుంటిఁ
గ్రొమ్మొలక లంతంతై తలలూఁపు చేనునడన్—
గాలి యొకింతరివ్వనుచు వెన్నుంబుల్క లెత్తించులోపున
నాదీపము చేతనాఱెను:—
మహామోదప్రసిద్ధంబుగన్ గనవచ్చెన్ ససియెల్ల,
చుక్కజిగిలోఁ, గాదంబినీకాంతిలోఁ,
దనసీ డించుక తోఁపరానిదయి,
యంథంబందె యందంబయై॥

తీయనిభావ మెంతో యలతెన్నునె పర్వెడు: కోకిలంబ !
కో! కో! యని నీదుకూత నడకోన వినంబడి మాఱుమ్రోయ
నేమిరా !
యిగురొత్తుచింతకొన కెక్కుచుఁ గొమ్మల చాటుమాటులో
సోయగమైన నల్లనెరసో యన డాగెదు వౌర !
నిండునీ క్రొమ్మెయుకొలంకు వంకను
బ్రిమోదమునన్ విరమించి తద్దిరా !

పాయమువంటి యమ్మధువు పాసె నినున్ ;
సహకారపాళికిం బోయె ఋతుప్రశస్తి ;
వలపుంగొను దక్షిణవాయుపోతముల్ మాయములయ్యె ;
మబ్బు వినుమార్గము గ్రమ్మె.
ప్రయోజనమ్మె నీ కేయెడఁ గానఁబోను.
వినికింత తగుల్వడఁగన్ రహించి స్వార్థాయిఁ
దర్థైకసారస నిసర్గము దోఁపఁగఁ బాడుచుంటి వాహా !
ఇఁక మామకీనశ్రుతు లంతకుఁనంతకుఁ దన్మయమ్మగన్.

మృదురసపుష్టి నీ వఱుత నీను స్వరమ్మటు మూల చింతపైఁ
గుదిరె నెటూ ? రసాల మిఁకఁ గోరవె ? నిశ్చయ
మొక్కొకప్పు డిమ్మెదకు విషాదసంగతములే
యనలెత్తగసేయు మాధురీమధునిభమైనసంస్మృతుల
మానసమర్మము లెందునొక్కెడే.॥

౧౭

వానకుఁ బిమ్మటన్ జరమభాగవిలాసము మీఱ,
భాస్కరుం డూనెఁ గదన్న! ఎఱ్ఱని మహోజ్జ్వలకాంతి,
సమస్తవస్తువుల్ తో నెఱుపెక్కి తోఁపఁగను,
తోరపుమోదము పుట్టినట్టుగన్ గానపరంపరన్
శుకపికావళి ఱెక్కల నార్చి పేర్చఁగన్.

సూనవిశేష మంతటివిచోద్యముగన్ వికసింపనేర
దేచాన వయోవిలాస మలచాడ్పున నంగచయమ్ము నూనతే
దా నవకంపు మాఱువున కయ్యదియే
సవతన్నఁ జెల్లుబో!
మానముతోడఁ జూడనగు మాద్రిని సొంపు వహించె.
ఏరి కే నేనుడిఁ దెల్పఁగల్గుదును?

ఎత్తుక నాదగుచిన్నిపుత్రు నజ్ఞానుని గొంచుఁ జూపితిని
చక్కని సూర్యుని మవ్వపుంజిగిన్.
వాని కపారమై నయనపర్వమమై విలసిల్లె మోముపై.!

౧౮

మూనతిరిగి పెఱుగుచేలు ముదమొసంగఁ జూచుకొం,
చానడుమను గలుపుమొక్క నక్కడకడఁ బెఱుకుచున్
వాననీరు కట్టుకొనుచుఁ, బచ్చగడ్డి గట్టుపై
నానవాలుపడిన నడను, హాళికుండు మఱలినన్.

౧౯

పెద్దచెఱువు కళింగల పిట్టగోడ పైని గూర్చుంటి
నెటో పరధ్యాని నగుచు:
ప్రక్క జలపాత గిరి ప్రతిధ్వనిని వినియొ?
ముందు నెఱిఁబచ్చసస్యంపుఁ బొందు గనియొ?

కాఁడి సమతఁబోవు బాడువలో తాళ్ళు
నిట్ట రక్షకభటులట్లు నిలువ;
క్రిమికీటకంబులు క్రింద గుబురుపొదఁ
గీచుమంచును శబ్ద మాచిచేయ;
నిశ్చలంపుఁ గొలంకు నీటిని లాగి
తటాలు బల్లలఁ బొర్లి తూలుచుండ;
సంధ్యకాంతిని బాసి సన్నసన్నఁ గడిమిచెట్లు
పంచను గున్కపాట్లు పడఁగ;
నెన్నకొనుచును, నెమ్మది నింపు గొలుచు,
భావకు నతీతమైనట్టి భావ మమరఁ జూచుచుంటిని.
వింతగఁదోఁచుఁగదర యొక్క వేళనునొక్కొక్క చక్కచూపు!

కొంతవడ కొండుగోపండు
గొండఁదప్పి దొఱకినటువంటి గొడ్డును దోలుకొనుచు,
ముందు వెడలెడుమంద చూపునను మించఁ
హోయెనే యంచు నెలుఁగెత్తి కూయుచుండి,

నన్నున్ జూచుచు నన్నవాఁడు

"తమ కానందింప నేమున్న దామన్నా నీళ్ళైన
రండి రండి" యని;

రమ్మన్నంతనే లేచితిన్
"అన్నా! తోఁచక యూరకే" ననుచు;
నే నం దంతపర్యంతముం గన్నారన్ గనినట్టి
పర్వ మది
యే కంటన్ గనన్ జెల్లునో॥

౨౦

ప్రకృతీ! నీకుమ మెట్టిదోకద
మహాపాషాణగుప్తార్థమున్
శకలంబుల్, శతముల్, సహస్రములుగా,
నానాఁడునున్ ద్రవ్వి నిం విక్రుతిం జేసినఁ గాని,
లేఖువిధిఁ గన్పించిచ్చుచుం జూపఁబన్ సుకృతిన్ జేసెదు
వైపరీత్యములకుం శుష్కింప వావంతయున్.

పెడపోటుల్ గునపంబు లెన్ని యిడెనో,
వేవేగ నాయన్నిఁటన్, గడువిడ్డూరము దోఁప,
శాద్వలపు మోకల్ తన్నితే పైకి!
పాఅడుగున్ జెక్కిన యల్ల పల్లనుల
నీ యాకాశమేఘంబు గన్పడఁగన్
మిక్కిలి నావులించుకొని సంపాదించితే నీరముల్!

అర్ధఖండితములై
యక్కడక్కడ నిల్చు నిడుదదిమ్మలు
నీట నీడఁ జూప;
ఒండొంటి నొఱయిక నులివు గొల్పెడు తెల్లు
క్రిక్కిఱియుచు మూలచక్కి బలియ;
ఎండ కెండుచు వాన కిగురొత్తు నొకపెద్దబూరుగు
వాయుసంబోధికాఁగ;
చిరజీర్ణతములయ్యుఁ బరివేష్టనములగు
పోతగుట్టలు
శాంతి పొందుపఱుప;
చిన్నియల ముసుంగునగవు,
చిఱుత నుడువు,
నీదు కూడిక జలములు నెమ్మిఁదార్చు.

దాన, దాన,
స్వస్వాంత మందందుకు కాఁగ
మఱచిపోనేర్తు వెప్పటి మాపుదలలు.॥

ఇ ది
ఇ క్క డ కు
స రి

# ప్రబోధసూక్తి

— — "Short and unpretentious poems"
Realistic in setting,
Inventive in Substance
Quiet in style
Suggestive in method" — —

— — "అనతిదీర్ఘములును
అకృత్రిమములును నగు పద్యములు
కూర్పునఁ గన్నులఁగట్టి నట్లుండునవి
అంశమునఁ గల్పింపఁబడ్డవి
శైలిని శాంతిపూరితమైనవి
సాధనమున వ్యక్తివికసితమైనవి" — —

The Beacon.

| వరుస ఊహాలసందర్భము | రచన |
|---|---|
| ౧ చీఁకటి-నదీరవము | 16-9-1917 |
| ౨ ఎట్లు సతమొ | 7-9-1917 |
| ౩ గుల్ల | 5-6-1921 |
| ౪ ప్రాఁతసనాయి | 19-9-1917 |
| ౫ పడవ | 12-1-1919 |
| ౬ మధురగీతిక | ? -9-1922 |
| ౭ వట్టిపాట | 6-1-1916 |
| ౮ వరికళ్ళము | 11-1-1915 |
| ౯ ముదము | 25-12-1919 |
| ౧౦ కడపటి గడ్డిమోపు | 18-11-1917 |
| ౧౧ రుద్రభూమి-గోపకుఁడు | 5-10-1916 |
| ౧౨ శోభ | ? |
| ౧౩ వర్ణము-వృత్తము | 2-9-1918 |
| ౧౪ స్వాగతము | 1-1-1915 |
| ౧౫ బోధిద్వయీప్రాచీనమ్ములు | 1-3-1922 |
| ౧౬ పచ్చనిసస్యము-దీపము | 2-9-1918 |
| ౧౭ చింతపైఁగోయిల | 5-7-1917 |
| ౧౮ వానవెనుక వెలుఁగు | 22-8-1917 |
| ౧౯ ఏ కంటన్ గనన్ జెల్లెనో? | 3-9-1916 |
| ౨౦ ఖనితస్థలి | 21-8-1916 |

పుటలు ౧-౨౨ స్ఫురణ:—సర్వసామాన్యముగ హొన్నాహేంద్రవర శ్రీరంగపట్టణ ప్రాంతము. ఛందస్సు పద్య లక్షణము.